౪. చాక్షుస మన్వంతర కథ వినుటవలన ఆరోగ్యము కల్గును.

౫. వైవస్వత మన్వంతర చరిత్ర వినుటవలన బలము ఆయుర్వృద్ధియు గలుగును.

౬. సూర్యసావర్ణి కథ వినుటవలన పుత్రపౌత్ర లాభము గలుగును.

౭. దక్షసావర్ణి మనుచరిత్ర వినుటవలన కీర్తి గలుగును.

౮. బ్రహ్మధర్మసావర్ణి చరిత్ర వినుటవలన శుభములు గలుగును.

౯. రుద్రసావర్ణి చరిత్ర వినుట చదువుటవలన సకల కార్యములు జయమును పొందును.

౧౦. రౌచ్య మన్వంతర కథ వినుట చదువుట వలన శత్రు సంహారమై సకలకార్యములు నెరవేరును.

౧౧. భౌత్య మన్వంతర కథ వినుట చదువుటవలన యిష్ట దేవతా ప్రసాదసిద్ధి గలుగును

౧౨. ఉత్తమ మన్వంతర కథ వినుట చదువుటవలన ధన ధాన్య సంపదలు గలుగును.

౧౩, ౧౪. తామస మన్వంతరముల చరిత్ర వినుట చదువుట వలన పశు, పుత్ర, కళత్ర, ధర్మ, సమృద్ధియు గలుగును.

మరియును సకల కోరికలును నెరవేరును. సుగుణ సంతానమును, ధనధాన్య పశు సమృద్ధియు గలిగి స్వర్గాది సకల భోగములు అనుభవించి సుఖించెదరు” అని మార్కండేయుడు జెప్పగానే క్రోష్టికి విని సంతోషమును పొందెను.

# వంశవర్ణనమున అంతర్గత సృష్ట్యాదులు

మార్కండేయుడు జెప్పుచున్నాడు "క్రోష్టికీ! క్షత్రియ వంశమునందు బుట్టిన ఉత్తమ రాజుల చరిత్రలను వినుటవలన ఇహాపరసౌఖ్యములు గలుగును. మనువు, యిక్ష్వాకు, దిలీప, అరణ్య, భగీరథుల చరిత్రములు అత్యంత పావనములు. వారు అనేకములగు యజ్ఞయాగాదులను జేసి వేదవేదాంగములను జదివి పవిత్రులయిరి. వీరి కథలను వినుటచేత పాపనాశన మగును.

పూర్వము బ్రహ్మ ప్రజలను సృష్టించదలచి దక్షిణ అంగుష్టమువలన దక్ష ప్రజాపతిని, వామాంగుష్టమువలన అతని భార్యను బుట్టించెను. దక్ష ప్రజాపతివలన దితి యను కన్యక జనించెను. ఆమెను కస్యప ప్రజాపతికి యిచ్చి వివాహము జేసెను. వారికి సూర్యుండు పుట్టెను" అని జెప్పగానే క్రోష్టికి యిటులని ప్రశ్నించుచున్నాడు,

"మార్కండేయ మునివర్యా! కస్యప దితులకు సూర్యుడు పుట్టెనని జెప్పితివి. ఆ సూర్యునకు రూపమేవిధముగా నున్నది? యే కారణముచేత ఆదిత్యదేవుడు కస్యప దితులకు పుట్టెను? కస్యపాదులు యే విధముగా సూర్యునారాధించిరి? సూర్యుని ప్రభావమున్ను, వృత్తాంతమున్ను సవిస్తరముగా జెప్ప వలసిన"దని కోరెను.

# సూర్యుని ప్రభావము

మార్కండేయుడు జెప్పుచున్నాడు, "కోష్టికీ! పరమ విద్య, శాశ్వత తేజస్సు, కైవల్యము, జ్ఞానము, ప్రాకామ్యము, సంవిత్తు, బోధకము, గతి, స్మృతి మొదలగు రూపములచేత బరమ ప్రకాశమానమగు బ్రహ్మము విరాజిల్లుచుండును. మొట్టమొదట ప్రపంచకమంతయు జలాకీర్ణమయి అంధకారముచే సర్వము శూన్యమై యుండును. ఆ ప్రకారము కొంత కాలము జరిగినపిమ్మట జలప్రవాహమున నురుగు యేర్పడి ఆ నురుగువలన గొప్ప గ్రుడ్డుగా యేర్పడెను. ఆ గ్రుడ్డును మధ్యస్థుడగు బ్రహ్మ మధ్యభాగమునకు సమముగా రెండు చెక్కలుగా చేసెను. ఆ సమయమునందు బ్రహ్మ ముఖము నుండి 'ఓం' అను ధ్వనిపుట్టెను. ఆ ఓంకారమువలన భూః, భువః, సువర్లోకములు పుట్టెను. వాటిని అవ్యాహృతిత్రయంబ మని జెప్పెదురు.

పిమ్మట ఓంకారము వలన సూర్యునకు సూక్ష్మరూపము యేర్పడెను. దానివలన మహః అను వ్యాహృతి పుట్టెను. దానివలన జనః అను వ్యాహృతి పుట్టెను. దానివలన తపః, సత్యము అను వ్యాహృతులు పుట్టెను. ఈ యేడు వ్యాహృతులు కలసి సూర్యుని రూపము యేర్పడెను.

మొదట జెప్పిన ఓంకారము తేజోరాశియగు బ్రహ్మ అనబడును. భిన్నముగా జేయబడిన గ్రుడ్డువలన బుట్టిన అవ్యక్త రూపుండగు బ్రహ్మ పూర్వ ముఖమునుండి ఋగ్వేదము, దక్షిణముఖము నుండి యజుర్వేదము, పశ్చిమ ముఖమునుండి సామవేదము, ఛందస్సులు పుట్టెను. ఉత్తర ముఖమునుండి అభిచారిక, ప్రయోగ, ఉపసంహారములు గల కృష్ణకాంతిచే ప్రకాశించు అధర్వణవేదము పుట్టెను.

యీ విధముగా నాలుగుభేదములు గలిగి వివిధశాఖా భేదములుగలిగి ఓంకారము ప్రభావముచే ప్రకాశించుచుండును.

౧. ఋగ్వేదము, ౨. యజుర్వేదము, 3. సామవేదములవలన సూర్యుడు క్రమముగా ప్రాతః మధ్యాహ్న, సాయంకాల ధర్మములు యేర్పడి ఆ ధర్మములు వలన ప్రకాశించుచుండును. మరియు ఆ సూర్యతేజము ఋగ్వేద రూపమున బ్రహ్మయై జగత్తును సృష్టించును. యజుర్వేదము విష్ణురూపమున ప్రజాపాలనము జేయును. సామవేదము రుద్ర రూపమున సంహారము జేయుచుండును. అందువలననే ఆ సూర్య తేజమును చతుర్వేదమయుంబనిన్ని, త్రిగుణాత్మకమయు మనిన్ని, త్రిమూర్తిస్వరూపమయు మనిన్ని యెంచబడుచు ప్రకాశించుచుండెననిన్ని తెలుసుకొనుము. పద్మమునందు పుట్టిన బ్రహ్మ ఆ సూర్యుని తేజస్సునుండి వెలువడు వేడిమివలన నీరు యింకిపోయి తాను జేయు సృష్టిని అంతయు తగులబెట్టుటను

జూచి విచారించి ఆ సూర్యు నారాధించి సూర్యతేజమును ఉపసంహారించెను.

పిమ్మట చతురాననుండు సకల చరాచరములను సృజించెను. బ్రహ్మవలన మరీచి గశ్యపులు పుట్టిరి. ఈ కశ్యపుని భార్యలును, దక్షకన్యకలు అగు వారిలో నతిదికి నింద్రాది దేవతలును, దితికి దైత్యులును, వినతకు గరుడ అనూరులును, స్వసకు యక్ష రాక్షసులును, కద్రువకు సర్పములును, ముని యనుదానికి గంధర్వులును, నరిష్టకు నచ్చరలును, మాతంగికి నైరావతాదులును, తామ్ర ఇల మొదలగువారికి పక్షులును, వృక్షములును మొదలగునవి బుట్టెను.

అందులో అతిది పుత్రులగు దేవతలకు త్రిలోకాధి కారమును నిర్ణయించిరి. అందువలన యజ్ఞములయందు హవిర్భాగములు పుచ్చుకొనుటకు అర్హులయిరి. కావుననే దైతేయులు అతిది పుత్రులయందు అసూయగలవారై, దేవతల ఐశ్వర్యమును జూచి సహింపజాలక అనేక విధములుగ బాధించుచు యుద్ధమును జేసిరి.

కొంతకాలమునకు రాక్షసులు దేవతలను వెడలగొట్టి స్వర్గపట్టణమును ఆక్రమించిరి. అందువలన అతిది విచారించి అఖండ తేజోరాశి యగు పరమపురుషుని గూర్చి తపంబు జేసెను. ఆ తపంబునకు సంతోషించి పరమపురుషుడు ప్రసన్నుడై యామెకు ఎదుట నిలచి వరమును కోరమని పల్కెను. ఆమె

ఆ పరమపురుషుని అనేక విధములుగ ప్రార్థించి తన కొడుకులను తన సవతి కొడుకులు రాక్షసులు బాధించుటను జెప్పెను.

ఆ మాటలు విని పరమేశ్వరుడు 'ఓ తల్లీ ! విచారమును పొందకుము. నేను నా అంశముచేత నీ గర్భమునందుబుట్టి నీ పుత్రులను కాపాడి నీ కోరికను నెరవేర్చెదను' అనిజెప్పి యదృశ్యుడాయెను.

అంతట కొంత కాలమునకు అతిథి గర్భమును ధరించి సూర్యుంగనెను. ఆ బాలుని అనేక విధములుగా స్తోత్రములను జేయగా ఆకాశవాణి 'యితడు మార్తాండుడని ప్రఖ్యాతి గలిగి సూర్యాధికారమున ప్రకాశించుచు దేవతలను రక్షించి అసురులను నాశనము జేయు'నని జెప్పెను. ఆ మాటలను తల్లిదండ్రులును, దేవతలును విని సంతోషమును పొందిరి.

పిమ్మట సూర్యుడు దేవతలను వెంటబెట్టుకుని దనుజుల మీదకు యుద్ధమునకు వెళ్లి రాక్షసులను భస్మీభూతులుగ జేసి బృందారకులకు స్వర్గపట్టణమును యిచ్చెను. ఆ కారణమున సూర్యుడు కస్యపమునికి తనయుడుగా పుట్టెను.

సూర్యుడు విశ్వకర్మ కుమార్తె యగు సంజ్ఞయందు వైవస్వత మనువును, యముని, యమున యను కన్యకను బడసెను. ఛాయ యను అంగనయందు శనైశ్వరుని, తపతి యను కన్యకను బడసెను" అని జెప్పి పిమ్మట యితులని జెప్పుటకు ఆరంభము జేసెను.

# రాజవర్ధనుని చరిత్ర

"క్రోష్టికీ! సూర్యుని మహాత్మ్యమును వినుము! పూర్వము దమనుడను రాజునకు రాజవర్ధనుడను తనయుడు గలడు. రాజవర్ధనుడు రాజ్యమును పొంది దుష్టమృగ, చోర, శత్రుబాధలు, దారిద్ర్యము, రోగములు లేకుండునటుల ధర్మ మార్గమున పాలించుచు విడూరథుడను రాజు కుమార్తె మానిని యనునామెను వివాహమాడి ఆమెవలన అనేకమంది సుతులను బడసెను.

యీ విధముగా యేడువేల సంవత్సరములు రాజ్యమును పాలించి ఒకనాడు తన భార్య తల అంటుచు తన కన్నులవెంట నీరు కారి రాజుమీద బడగా జూచి 'ఏ కారణమున విచారించు చుంటివి?' అని అడిగెను.

ఆమె 'ఓ రాజచంద్రమా! నీ శిరోజములు ఫలితము లగుచున్నవి. అందువలన విచారము గలిగిన'దని జెప్పెను.

ఆ మాటలను రాజు విని 'ఓ సుందరీ! యేల విచార మును పొందెదవు? మనము యేడువేల సంవత్సరములు సుఖములను పొందితిమి. పరిపాలనా సామర్థ్యము, సుగుణ సంపదలు గల పుత్రులం బడసితిమి. జరామరణములను తప్పింప శక్యముగాదు. రాజ్యమును పుత్రులకు వప్పగించి మనము తపంబునకు బోవుదము' అని జెప్పెను.

ఆ మాటలను మంత్రి పురోహిత పౌరాదులు విని కొంతసేపు విచారించి ‘ ఈ రాజు మనలను కన్న పుత్రులకంటెను యెక్కుడు ప్రేమతో పరిపాలనము జేయుచుండెను. ఈ రాజు లేని బ్రతుకు మనకు వ్యర్థమగును’ అని విచారించి సామర్థ్యము గల బ్రాహ్మణులను తపోవనమునకు పంపించి తమ రాజునకు పదివేల సంవత్సరములు ఆయువు గలుగునటుల జేయుటకు నిశ్చయించుకుని రాజునకు దెలియకుండ తపోవనమునకు పంపించిరి.

అంతట ఆ బ్రాహ్మణులు సూర్యునిగూర్చి ఘోరమగు తపంబును జేయగా సూర్యుడు ప్రత్యక్షమై వారుకోరిన ప్రకారము రాజునకు పదివేల సంవత్సరములు ఆయుర్దాయమును ఇచ్చి అదృశ్యుడాయెను.

అప్పుడా బ్రాహ్మణులు వచ్చి మంత్రి పురోహితాదులతో జెప్పి ఈ సంగతి రాజునకు విన్నవించి మహా సంతోషముతో తమ యిండ్లకు జనిరి.

ఆ మాటలను రాజు విని విచారమనస్కుడై యుండెను.

అంతట రాజు భార్యయు రాజును జూచి ‘ రాజా ! ఈ పురజనులందరును సంతోషమును పొందుచుండగా నీవు విచారమును పొందుటకు హేతువ యేమిగలదు ? ’ అనిఅడిగెను.

రాజేంద్రుడు జెప్పుచున్నాడు, 'తరుణీ! నాకు యిష్ట మయిన మీరందరును వుండగా నాకు పదివేల సంవత్సరములు ఆయువు గలుగుట మంచిదిగాదు. మీరు లేనియెడల నాకు పదివేల సంవత్సరములు ఆయువు గలుగుట దుఃఖమేగదా? మీరు అందరును, మంత్రి పురోహితాదులు అందరును మృతిని పొందిన పిమ్మట నేను మాత్రము బ్రతికియున్న ప్రయోజన మేమియున్నది?' అని పలికెను.

రాజుభార్య జెప్పుచున్నది, 'అటులయిన మీరు ఆలో చించుట యుక్తమే' అనెను.

పిమ్మట రాజు భార్యాసమేతముగా హిమవంతమునకు వెళ్లి సూర్యునిగూర్చి తపంబుజేయగా సూర్యుడు ప్రత్యక్షమై రాజు కోరిన ప్రకారము భార్యా పుత్రాదులకున్ను, పురజనుల కున్ను పదివేల సంవత్సరములు ఆయువు కలుగునటుల వరంబుల నిచ్చి అదృశ్యుడాయెను.

వరములను పొంది రాజు భార్యాసమేతముగా నిజ పట్టణమునకు వచ్చి యీ వృత్తాంతమంతయును పౌర, అమా త్యాదులు అందరకు జెప్పగా వారు విని సంతోషమునుపొంది సుఖముగా నుండిరి. కావున నో కోష్టికీ! సూర్యు నారాధించిన వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాదులు గలుగు ననుటకు సందేహము లేదు" అని మార్కండేయులు జెప్పెను.

# సూర్య వంశము

" కౌశికీ ! సూర్యుని సంతతిని గూర్చి జెప్పుచున్నాను ఇటువంటి ప్రభావముగల సూర్యునకు వైవస్వతుడు ప్రఖ్యాతిని బొందెను. అతనికి యిక్ష్వాకుడు, నాభగుడు, రిష్టుడు, శర్యాతి, కరూషకుడు, నరిష్యంతుడు, నాభాగుండు, వృషధృడు, ధృష్టుడు వారందరును వేరువేరుగ రాజ్య పరిపాలనము జేసి ప్రఖ్యాతిని పొందిరి. మనువు మిత్రావరుణ యిష్టిని జేయగా ఇళ సుద్యుమ్నుడు పుట్టెను. అతనికి, అడవికి వేటకు వెళ్ళగా వనకన్యక యందు పురూరవస్సు పుట్టెను. ఇళసుద్యుమ్నుడు తన కుమారులు యుత్కల వినత గయులకు రాజ్యమును పంచి యిచ్చి ప్రతిష్టానపురము బురూరవస్సునకు యిచ్చెను.

## వృషధృడునకు శూద్రత్వము గలుగుట

మను పుత్రులలో వృషధృడు అడవికి వేటకు వెళ్లి అనేక మృగముల వేటాడి అలసి, బ్రాహ్మణుని ఆవును జూచి అరణ్య మృగము అని తలంచి బాణముచే కొట్టగా విప్రకుమారుడు జూచి శూద్రుడవు గమ్మని శాపము యిచ్చెను. అందువలన వృషధ్రుడు శూద్రత్వమును పొందెను.

# నాభాగ చరిత్ర

కరూషకుని వృత్తాంతమును జెప్పుచున్నాను! కరూషకునకు కారూషులు, క్షత్రియులు మొదలగు సుతులు కలిగిరి. దృష్టునకు నాభాగుడు పుట్టెను.

నాభాగుడు సకల విద్యలయందు ప్రవీణుడై. వైశ్య కన్యను వివాహమయి, జాతి భ్రష్టుడయి, బహుపాలన, కృషి, వాణిజ్యములు, వైశ్య వృత్తి అవలంబించి జీవించుచుండెను. అతనికి భననుడను పుత్రుడు కలిగెను. ఆతడు గోవులు కాయుట నీచమని తలంచి హిమవంతమునకు పోయి అస్త్రశస్త్రాదులను నేర్చుకుని నిజ నగరమునకు వచ్చి జ్ఞాతుల నోడించి రాజ్యము పొంది తండ్రిని రాజ్యమును పాలింపమనెను.

తండ్రి అయిన నాభాగుడు 'పుత్రా! నేను పితృవాక్యమున వైశ్యవృత్తిని పొందితిని. గాన నీవే రాజ్యమును పరిపాలనము జేయు'మని తన కుమారుడు భననుని నియమించెను.

అంతట నాభాగసుతుడు జనకుని యిష్టమున రాజ్య భారము వహించి చతుస్సముద్ర పరివేష్టితమయిన నీ భూమండలము యేకఛత్రాధిపతియై పాలించెను" అని మార్కండేయులు జెప్పెను.

## వత్సంధ్రుని చరిత్ర

"క్రోష్టికీ! వత్సంధ్రుడను రాజు చరిత్రను జెప్పు చున్నాను! వత్సంధ్రుడు రాజ్యమును పాలించు కాలమున కుజంభుడను రాక్షసుడు లోకములను బాధించుచుండగా ఆ రాక్షసుని సంహరించి సౌనందయను కన్యను వివాహమై అనేక యజ్ఞములను జేసి ధర్మ పాలనమును జేయుచు సకల సుఖములను పొంది రాజ్యమును కుమారులకు యిచ్చి భార్యా సమేతుడై తపోవనంబునకు పోయెను.

## ఖనిత్రుని చరిత్ర

ప్రాంసువను రాజేంద్రుడు రాజ్యమును పాలించి తన జ్యేష్ఠపుత్రుడగు ఖనిత్రునకు రాజ్యపాలనము ఇచ్చి తాను భార్యా సమేతుడై తపోవనంబునకు పోయెను.

ఖనిత్రుడు రాజ్యమును ధర్మపరిపాలనమును జేయుచు, భ్రాతృవత్సలుడై తమ్ములు నలుగురకు తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరమునందు గల దేశములకు అధిపతులుగ జేసి అత్రిగోత్రజుడైన సుహోత్రుని, గౌతమ వంశజుడైన కుశాగ్ర బుద్ధిని, కశ్యప వంశజుడైన ప్రమోదుని, వసిష్ఠ పుత్రుడైన హాసితుని క్రమముగ తమ్ములు నలుగురుకు మంత్రులుగ నియమించి తాను పరిపాలనము జేయుచుండెను.

యిటుల చాలకాలము జరుగగా ప్రమతికి ఉపమంత్రి అయిన విశ్వవేది అను మంత్రి దుర్మంత్రము జేసి అన్న అయిన ఖనిత్రునిమీద తమ్ములకు ద్వేషమును పుట్టించి ఖనిత్రాదులను జంపుటకు విశ్వవేది మొదలగు బ్రాహ్మణులు అభిచారిక మను హోమములను జేయించిరి. ఆ హోమమువలన హోమగుండము నుండి గొప్ప మహాశక్తి పుట్టి 'నన్ను పుట్టించిన కారణమేమి?' అని మంత్రవేదిని అడిగెను. అంతట మంత్రవేది 'అమ్మా! ఖనిత్రుని దారాపుత్రాదులతో కూడా నిర్మూలనము జేసి ఆ రాజ్యమును సకల సంపదలను మాకు యిప్పింపుము' అని కోరిరి.

ఆ మహాశక్తి ఖనిత్రునివద్దకు వెళ్లి చూడగా ధర్మ స్వరూపుడున్ను, మహాపుణ్యశాలియు, పరధన, పరకాంతా విరక్తుడున్ను, పుణ్య దురంధరుడున్ను అయిన ఖనిత్రుని జూచి భయముజెంది వెంటనే తనను పుట్టించిన ఖనిజ సోదర వర్గమును సర్వమును నాశనము జేసి అదృశ్యమాయెను.

ఖనిత్రుడు యీ సంగతి కుశాగ్రబుద్ధి యను మంత్రి వలన తెలుసుకుని విచారమును పొంది రాజ్యభారము నంతను నిజపుత్రుడు క్షుతపునకు యిచ్చి తాను భార్యా సమేతముగా తపంబునకు జనెను" అని మార్కండేయుడు జెప్పగా క్రోష్టికి విని ఆనందమును పొందెను.

# క్షుతప భూపాలుడు

మార్కండేయుడు చెప్పుచున్నాడు, "క్రోష్టికీ! క్షుతప భూపాలుడు తండ్రికంటె ఉత్తముడని ప్రఖ్యాతి గలిగి భూమిని పాలించుచుండెను. అతని గుణంబులు వేనోళ్ల గీర్తించుచుండిరి. దేవాలయములను గట్టించి, దేవతాదులకు నిత్యము ధూప దీప నైవేద్యంబులకున్ను, రాగ భోగ నృత్యాది నిత్యోత్స వాదులకున్ను అనేక భూములను గ్రామములను యిచ్చి బ్రాహ్మణులకు వేదాధ్యయనాది సకల శాస్త్రములు అభివృద్ధి అగుటకున్ను యజ్ఞయాగాది క్రతువులు జరుగుటకున్ను, నిత్య కర్మలు నిరాటంకముగా జరుగుటకు అనేక గ్రామములను, భూములను యిచ్చి వాటిమీాద సుంకములు లేకుండునటుల నిర్ణయించెను.

తనకు విదర్భదేశ రాజు పుత్రికయగు నందిని యను భార్యయందు విదింశుడను పుత్రుడు పుట్టెను. అతడు రూప, సౌందర్య, సుగుణసంపత్తి గలవాడై, సకలవిద్యా పారంగతుడై శౌర్య సాహసాది గుణములు గలవాడై ప్రఖ్యాతి గలిగి యుండెను. ఆ కుమారునకు రాజ్యభారమును యిచ్చి తాను భార్యా సమేతుడై తపోవనమునకు పోయెను" అని చెప్పెను.

# వివింశసుతుడు ఖనిత్రు చరిత్ర

మార్కండేయుడు చెప్పుచున్నాడు, "క్రోష్టికీ! కొంత కాలమునకు వివింశునకు ఖనిత్రుడను పుత్రుండు పుట్టెను. అతడు సకలగుణ సంపన్నుడు కాగా అతనికి రాజ్యభారమును నప్పగించి తాను తపంబునకు పోయెను.

ఖనిత్రుడు అనేక యాగములు, పుణ్యకార్యములు జేయుచుచుండెను గాని సంతానము గలుగలేదు. పుత్రార్థియై పితృయాగము జేయుటకు ఆలోచించుచుండగా ఆ యజ్ఞమునకు కావలసిన మాంసముకొరకు రాజు అడవికి వెళ్లి మృగముల కొరకు తిరుగుచుండగా మృగములు భయమునుజెంది రాజు వద్దకు వచ్చి యిటులని ప్రార్థించెను, 'ఓ రాజా! నీవు నన్ను యజ్ఞపశువుగా గైకొనుము. నేను యజ్ఞమునందు మరణము నొందెదను' అని ఒక మృగము జెప్పెను. వేరొకమృగము అటులనే పలికెను.

యిటుల పలుకుచుండెడి మృగముల వాక్యములను ఆ రాజు విని ఆశ్చర్యమును పొంది యిటులని పలికెను. 'ఓ మృగోత్తములారా! భూలోకమునందు జన్మించిన ప్రాణి కోటి యంతయు ప్రాణభయము గలిగి తన ప్రాణములను రక్షించుకొనుటకు ప్రయత్నము జేయుచుండును. కొన్ని

మృగములు నన్ను జూచి ప్రాణభయమున పారిపోవుచుండగా మీరు భయమునెందక 'నన్ను జంపుము, నన్ను జంపుము' అని పలుకుచున్నారు. కారణమేమి ? ' అని యడిగెను.

మృగములు జెప్పుచున్నవి, ' ఓ రాజశ్రేష్ఠమా ! భూలోకమునందు బుట్టిన ప్రాణికోటికి సంతానము గ్రగల్గినేని జన్మ సాఫల్యమును పొందును. పితృ వర్గమునకు గతులు గలుగును. పుత్రహీనునకు ఇహమునందును, పరమునందును సుఖము లేదు. మరియు అటువంటివారల జన్మము మేక మెడ మీద నున్న చన్నులవలె నిరర్థకములు. మేకకు బరువునకు గదా; నాకు సంతోషము లేదు. యిటువంటి నా శరీరము శునకాదులు తినును. అంతకంటె పుత్రార్థివైన నీ పితృ యజ్ఞమునకు ఉపయోగపడుట ఉత్తమమని తలంచితిని ' అని ఒక మృగము పలికెను. ఆ సమయమునందు మరియొక మృగము వచ్చి జెప్పుచున్నది, ' రాజేంద్రా ! నా శరీరమును నీ యజ్ఞమునకు తీసుకునిపొమ్ము. ఎందువల్లననగా ! నాకు భార్యయు, పుత్రులు, పుత్రికలు, మనుమలు మొదలగు బంధు జనము చాలామందిగలరు. వీరందరును ఆహారమునకు అడవి యందు సంచరించునప్పుడు యే దుర్మార్గుడు వీరిని చంపునో అని వీరు యింటికి వచ్చువరకు విచారించుచుందును. వీరందరును సుఖంబుగా నున్నప్పుడే నేను మృతిని బొందితినేని యిహ పరములందు సుఖములు గలుగును. నీ యజ్ఞమును సఫల మిచ్చును. అందువలన నన్ను జంపమంటిని ' అని జెప్పెను.

రాజు మృగములు జెప్పిన వాక్యముల అర్థమును దెలుసుకుని ' ఓ మృగములారా! మీరు సుఖంబుగా నుండుడు. నేను తపంబునకు హిమవంత పర్వతమునకు వెళ్లి అచ్చట పరమేశ్వరుని గూర్చి తపంబు జేయుదును ' అనెను.

పిమ్మట రాజు బదరికావనమునకు జని గోమతి యను నదీతీరమునందు ఇంద్రునిగూర్చి తపంబు జేసి యింద్రుని అనుగ్రహమువలన పుత్రలాభమును పొంది నిజ రాజధానికి వచ్చెను.

అంతట కొన్నిదినంబులకుత రాజేంద్రునకు బలాశ్వుండను పుత్రుడు పుట్టెను. ఆ కుమారుడు కాలక్రమమున సకలశాస్త్ర పారంగతుడై యవ్వనమును పొందగా రాజ్య పరిపాలనమునకు కుమారుడు తగినవాడని సంతోషమును పొంది పుత్రుడు బలాశ్వునకు రాజ్యభారమును నప్పగించి తపంబునకు జనెను.

# వీక్షితుని చరిత్ర

బలాశ్వుండు సకల రాజులను జయించి భూమండలము నకు చక్రవర్తియై ధర్మ పరిపాలనము జేయుచుండగా యితర రాజులు సహించలేక ఒక తావున కుమికూడి చతురంగ బలములతో సహితముగా వచ్చి బలాశ్వుని పట్టణమును ముట్టడించిరి. అంతట బలాశ్వుడు తన అశ్రద్ధవలన మోసము గలిగెనని విచారించి మంత్రి సామంత సేనానాయకుల రప్పించి

దర్భాకరుజేసి యేమిజేయుటకు దోచక రెండు చేతులతోను నోరును మూసుకొనెను. ఆ రెండుచేతుల సందుల నుండి వెలువడిన వేడి గాలివలన చతురంగబలములు పుట్టినవి.

అంతట రాజున్ను, మంత్రులు మొదలగువారున్ను సంతోషించి ఆ సేనలను తీసుకుని శత్రువులతో యుద్ధమును జేయగా శత్రురాజులు భయపడి ప్రతి సంవత్సరమును కప్పము లను యిచ్చునటుల యేర్పాటులను జేసుకుని తమతమ తావు లకు వెడలిపోయిరి. ఆ కారణమున బలాశ్వునకు కరంధముడని కీర్తి కలిగెను.

కొంతకాలమునకు వీర యను భార్యయందు పుత్రుడు కలిగెను. అతనికి అవీక్షిత్తని పేరుపెట్టెను. ఆ కుమారునకు కణ్వమహామునివలన సకల శాస్త్రములు సమగ్రముగా నభ్య సించెను.

## అవీక్షిత్తు చరిత్ర

కొన్నిటికి అవీక్షిత్తు గురు అనుమతమును పొంది హేమ వర్మ యను కన్యారత్నము యొక్క స్వయంవరమునకు పోయి యెల్లరాజులను జయించి ఆ కన్యారత్నమును గొనిపోయెను. అనేక స్వయంవరములకు వెళ్ళి రాజుల నందర జయించి గౌరి, సుభద్ర, మొదలగు అనేకమంది కన్యలను వివాహమాడెను.

## అవీక్షితుడు వైశాలిని స్వయంవరమునకు వెళ్లుట

విదిశాపురాధిపుడగు విశాలుడను రాజు తన కుమార్తె వైశాలిని యను కన్నియకు స్వయంవరమును జాటించగా ఆ వృత్తాంతమును అవీక్షిత్తువిని చతురంగ బలములను తీసుకుని వెళ్లి ఆ కన్యను బలాత్కారముగా తీసుకుని వచ్చుటకు ఆలోచించెను.

అచ్చటనున్న రాజులందరును యీ రాజుచేత అనేక పర్యాయములు జయింపబడినవారగుటచేత అందరును యేకమై అవీక్షిత్తును మాయోపాయమున బట్టుకుని విశాలునివద్దకు తీసుకొనిపోయిరి. విశాలుడు అవీక్షిత్తు పట్టుబడుటకు సంతసించి తన బంధికానాయందు బంధించి తన కుమార్తెను చిక్కిన రాజ నందనులలో ఒక్కని వరింపవలసినదని జెప్పెను. రాజకుమార్తె అవీక్షిత్తును తప్ప యితరులను వరింపనని జెప్పెను. అందువలన తండ్రియైన విశాలునికి కోపమువచ్చి ఒక్క రాజపుత్రునకు యిచ్చి వివాహము జేయుటకు ప్రయత్నము జేసెను.

ఆ ప్రయత్నమును వైశాలిని విని తండ్రి అయిన విశాలుని జూచి 'తండ్రీ! నీవు యిటువంటి ప్రయత్నము జేయుట మంచిదిగాదు. నేను అవీక్షితుని తప్ప యితరుల వరింప'నని జెప్పెను.

ఆ మాటలను విశాలుడు విని ఏమి జేయుటకు వీలులేక జ్యోతిష్కుల రప్పించి 'పండితులారా! నా కన్నియ స్వయంవరమునకు అనేక విఘ్నములు గలుగుచున్నవి. ఈ సమయమునందు వివాహము జేయుట తగునా? తగదా?' అని ప్రశ్నించెను.

అంతట జ్యోతిష్కులు కొందరు 'కొంతకాలము వరకు ఆలస్యమును జేయుట మంచిది' అని రాజునకు జెప్పిరి.

ఆ మాటలు రాజు విని అంగీకరించి కుమార్తెకు స్వయంవరమును కొంతకాలము వరకు నిలుపు జేసి పిమ్మట జేసెదనని జెప్పెను. స్వయంవరమునకు వచ్చిన రాజులు ఎవరి తావులకు వారు పోయిరి. అవీక్షిత్తునుమాత్రము కారాగారము నందు ఉంచెను.

## కరంధముడు విశాలునివిూదకు యుద్ధమునకు వచ్చుట

కరంధముడు తన పుత్రుడు అవీక్షిత్తు కారాగారము నందున్న సంగతి తెలసి విచారమును బొంది యీ సంగతి మంత్రి సామంత సేనానాయకులతో జెప్పి విచారించగా వారందరును విచారించి 'రాజోత్తమా! అవీక్షిత్తు యుద్ధ విశారదుడు. ఆ వీరుని యుద్ధమునందు దేవేంద్రాదులు జయింప లేరు. అధర్మ యుద్ధమున, యేమరిపాటున అతనిని బంధించి యుందురు' అని జెప్పిరి.

ఆ మాటలను కరంధముడు విని చతురంగ బలములను తీసుకుని రణభేరిని వేయించి జయలుదేరి వెళ్ళి విదిశాపురంబును నలువైపులను ముట్టడించి విశాలుని బంధించి తన కుమారుడు అవీక్షిత్తును కారాగారమునుండి విడిపించెను. అటుల విడిపించి తన కుమారుని గప్పించి కౌగలించుకొని సమీపమునందు కూర్చుండబెట్టుకొనెను.

అంతట విశాలుడు 'రాజేంద్రులారా! నాయందు కోపము వహింపదగదు. నా కుమార్తె వైశాలినిని అవీక్షిత్తునకు యిచ్చి వివాహము చేసెదను. నా తప్పును క్షమించి యిందుల కంగీకరించవలసిన'దని కోరెను.

ఆ మాటలను కరందముడు విని సంతోషించి తన కుమారుడు అవీక్షిత్తు అభిప్రాయమును తెలుసుకొనుటకు గాను తనయుని వైపు జూచెను.

అవీక్షిత్తు విచారముగలవాడై 'రాజేంద్రా! నేను యీ కన్య జూచుచుండగా నేను యితరులచేత పట్టుబడితిని. అందువలన ఈ వైశాలినిని నేను వివాహము ఆడ'నని జెప్పెను.

ఆ మాటలను వైశాలిని విని 'రాజకుమారా! నీవు అటుల పలుకుట న్యాయముగాదు. నీవు అజేయుడవు, పరాక్రమశాలివి. నిన్ను యుద్ధమునందు దేవతలు సహితము జయించలేరు. యీ రాజులందరును నీయందు అసూయ గలవారై యేకమై అన్యాయముగ యుద్ధము కల్పించి నిన్ను పట్టుకొనిరి

గాని, నిజముగా నిన్ను యుద్ధమునందు జయించువారు యీలోకములో లే'రని పలికి 'ఓ రాజపుత్రా! నిన్నుగాక యితరులను నేను వరింపను' అని పలికెను.

ఆ వచనములు కరంధముడు విని కుమారునకు అనేక విధములుగ జెప్పెను. అందులకు కుమారుడు 'తండ్రీ! నీవు యీ విధముగా పలుకుట న్యాయముకాదు. శత్రువులచేత పట్టుబడిన క్షత్రియాధముడు స్త్రీ సమానుడు. కనుక నేను వివాహము జేసుకొనువాడనుగాను. అదియును గాక యే స్త్రీ ముఖమును జూడను. కావున నాకు తపోవనంబునకు పోవుటకు అనుజ్ఞ యివ్వవలసిన'దని జెప్పి అనుజ్ఞను పొంది వనంబునకు వెడలిపోయెను.

అంతట విశాలుడు 'అమ్మా, వైశాలినీ! నిన్ను అవీక్షిత్తు వివాహము ఆడడు. కావున మరియొక రాజపుత్రుని వరింపుము' అని పలికెను.

అందుల కామె 'తండ్రీ! నేను అవీక్షిత్తును తప్ప యితరులను వివాహము ఆడను. నేను తపంబునకు అడవికి పోయి మెన్ని జన్మముల నెత్తినను అవీక్షిత్తుయే భర్త యగు నటుల యీశ్వరుని గూర్చి తపంబు జేయుదును. గాన నేను తపంబు జేసుకొనుటకు వనంబునకు వెళ్లుటకు అనుమతించవలసిన'దని జెప్పి అనుజ్ఞ పొంది తపంబునకు వెడలిపోయెను.

# వైశాలిని తపఃప్రభావము

వైశాలిని తల్లిదండ్రుల అనుజ్ఞను పొంది వనంబునకు వెళ్లి నిరాహారియై ఘోరతపంబు జేయుచుండెను.

ఆ తపంబునకు దేవేంద్రుడు సంతసించి వైశాలినిదగ్గరకు వచ్చి 'మానినీ! నీకు అవీక్షిత్తువలన సప్తద్వీపములను పరిపాలింపగల కుమారుడు పుట్టును. నీ కుమారుడు దేవతలు జయింపలేని అశంకు, తరుజిత్తులను రాక్షసులను జయించి కీర్తిని పొందును' అని జెప్పి అదృశ్యుడాయెను.

ఆ మాటలను విని వైశాలిని నియమిత వ్రతమును జేయుచు ఆ వనమునందే నివసించియుండెను.

# అవీక్షిత్తు జనని వ్రతమును బూనుట

అవీక్షిత్తు జనకుడు నిజనగరమునకు వచ్చి జరిగిన వృత్తాంతమును తన భార్య అయిన అవీక్షిత్తు తల్లికి జెప్పగా ఆమె విచారమును పొంది కోరిన కోరికలను యిచ్చునట్టి కిమచ్ఛకమను వ్రతమును ఆచరించి జేయుటకు నిశ్చయించుకుని తన కుమారుడు అవీక్షిత్తును వెదకి రప్పించి 'తనయా! తల్లి దండ్రుల మనోభీష్టములను కుమారులు దీర్చుట ధర్మము. అందువలన నా కోరిన కోరికను నెరవేర్చుటకు కిమచ్ఛక మను వ్రతమును జేయుము' అని బోధించి తన కుమారునిచే ఆ వ్రతమును జేయించుచుండెను.

ఒకనాడు తన కుమారుని జూచి 'తనయా, అవీక్షిత్తు! నీవు నీ తండ్రి కోరికను గూడ నెరవేర్చుట ధర్మము' అని పలికి కుమారుని తండ్రివద్దకు పంపించెను.

అంతట కరంధముడు కుమారుని కౌగలించుకుని మంచి మాటలను జెప్పి 'కుమారా, అవీక్షిత్తు నాకు పౌత్రుని జూడవలె నని కోరిక గలదు. పౌత్ర దర్శనమున పితరులకు స్వర్గలోక ప్రాప్తి గలుగునని పెద్దలు జెప్పుదురు' అని పలికెను.

ఆ మాటలను కుమారుడు అవీక్షిత్తు విని 'ఓ తండ్రీ! నీ మనోభీష్టము నెరవేర్చుట సాధ్యముకాదు. నేను స్త్రీల యెదుట అపజయమును పొందితిని. అందువలన స్త్రీ సమానుడ నైతిని. కావున నేను నీ యిష్టము నెరవేర్చజాలను. యితర అభిమతములను కోరుము. యెంత దుష్కరమైనను నెరవేర్చెదను' అని జెప్పెను.

ఆ మాటలను తండ్రి విని 'కుమారా! సకలగుణ సంపన్నుడవైన నీవంటి కుమారులుగల తల్లిదండ్రులకు నెరవేరని కార్యములు యేవియు నుండవు. అందువలన నీవు మాకు పౌత్ర దర్శనము గలుగజేయుము' అని జెప్పెను.

అవీక్షిత్తు తండ్రి కోరికను నెరవేర్చుటకన్న వేరు ధర్మములు లేవని ప్రతిజ్ఞాభంగము జేయుటకు అంగీకరించి రాజ్యపాలనమునందు దండ్రికి సహాయముగా రాజకార్యములను నెరవేర్చుచుండెను.

యీ విధముగా కొంతకాలము జరిగినపిమ్మట ఒకనాడు వేటకు అడవికి జనెను. ఆ సమీపమునందు 'అయ్యయ్యో! నన్ను రక్షింపుడు, రక్షింపుడు. దీనురాలను' అని యేడ్చుచున్న స్త్రీ ఆలాపము వినబడెను. రాజపుత్రుడు ఆ రోదనము విని ఆ ఆర్తారావము వచ్చుచున్న వైపునకు తన గుఱ్ఱమును తోలెను.

ఆ సమయమునందు దృఢకేసుడు అను రాక్షసుడు ఒక్క అంగనామణిని యెత్తుకొనిపోవుచుండుటను జూచెను.

రాక్షసుడు యెత్తుకొనిపోవుచున్న అంగనామణి యిట్లని పలుకుచు యేడువసాగెను. 'యీ భూలోకమునందు యెవ్వాని బలపరాక్రమములు విని రాజులు భయమును పొందుచుందురో, యెవ్వని ప్రతాపాది సాహస ధైర్యాది గుణములను దేవతలు సహితము కొనియాడుచుందురో అటువంటి బలపరాక్రమ సంపన్నుడైన అపీక్షితు భార్యను. గిరి ప్రతాపశాలి యగు కరందముని కోడలను. అటువంటి నన్ను యీ దుర్మార్గుడయిన రక్కసుడు యెత్తుకొనిపోవుచున్నాడు' అని రోదనము జేయుచుండెను.

ఆ మాటలను అపీక్షితు విని 'యేమి చిత్రముగ నున్నది! యీమె నాకు భార్య యెట్లుల య్యెను? నా భార్య యీ రక్కసునకు యెట్లుల పట్టుబడెను' అని ఆలోచించి ఖడ్గమును దీసి రాక్షసునిమీదికి గుఱ్ఱమును దుమికించెను.

ఆ రాక్షసుడు వైశాలినిని క్రింద పారవైచి రాజుతో యుద్ధమునకు ప్రారంభము జేసెను. అంతట అవీక్షిత్తు తన ఖడ్గమున రాక్షసుని సంహారించగా దేవతలు సంతోషించి పుష్పవర్షమును కురిపించిరి.

దేవతలు సంతోషముతో అవీక్షిత్తునకు ప్రత్యక్షమై 'ఓ రాజపుత్రా! యీ రాక్షసుడు నిత్యము మమ్ములను బాధింపుచున్నాడు. యీ దుర్మార్గుని జంపుటచేత నీవు సర్వోత్తముడవని తలంచితిమి. నీకు కావలసిన వరంబులను కోరుము. యిచ్చెదము' అని దేవతలు పలికిరి.

## వైశాలిని వృత్తాంతము

అవీక్షిత్తు దేవతలు పలికిన వాక్యములను వినిన పిమ్మట దేవతలను 'ఈమె యెవ'రని ప్రశ్నించెను. అందులకు దేవతలు యిటులని జెప్పిరి, 'అవీక్షితూ! యీ వైశాలినీ పుత్రిక వైశాలుని కుమార్తె. యీమె నీ కొరకు అనేక బాధలను పొందుచున్నది. యీమెయందు నీకు సకలగుణసంపన్నుడగు పుత్రుడు పుట్టును. యీమె తపంబుజేసి నీవలన సర్వలోక పూజ్యుండును, సప్తద్వీపాధిపతియు నగు పుత్రుడు గలుగునటుల వరములను పొందియున్నది' అనిజెప్పి అదృశ్యులైరి.

పిమ్మట అవీక్షిత్తు వైశాలినిని గాంచి 'నీవు యీ తావునకు యెటుల వచ్చితివి?' అని అడిగెను.

ఆ మాటలకు వైశాలిని 'రాజపుత్రా! ఆనాడు నీవు నన్ను ఆదరింపకపోవుటచేత తల్లిదండ్రుల అనుమతి పొంది ఈ తాపువనకు వచ్చి నిరాహారిగనుండి తపంబును జేయుచుండగా దేవేంద్రుడు వచ్చి నీవలన నాకు సప్తద్వీపాధిపతియగు పుత్రుడు పుట్టునని వరంబుల నిచ్చెను. అంతట ఒక్క సర్పము వచ్చి నన్ను పట్టుకొని నాగలోకమునకు తీసుకొని పోయెను.

ఆ సమయమునందు నాగకన్నియలు నన్ను ఆ సర్పము నుండి విడిపించి 'నీ పుత్రునివలన మా కులమునకు ఆపద కలిగి నప్పుడు మా కులమును రక్షింపవలసిన'దని కోరిరి. అందులకు నేను సమ్మతించితిని. అంతట నాగకన్నియలు నాకు ఉపవాసాదులవలన కృశించి పడు బాధలను పొందకుండు నటుల దీవించి నన్ను దేవతా పుష్పములచే అలంకరించి భూలోకమునకు పంపించిరి. అందువలన నాకు పూర్వపు సౌందర్యాదులు గలిగియున్నవి. యిప్పుడు యీ దురాత్ముడైన రాక్షసుని సంహరించి నన్ను రక్షించితివి. యిప్పుడు నన్ను నీవు గాంధర్వవిధిచే గ్రహింపుము' అని జెప్పెను.

ఆ మాటలను అవీక్షిత్తు విని 'సుందరీ! నేను చేసిన ప్రతినను తల్లిదండ్రుల కోరిక ప్రకారము విడిచితి'నని జెప్పు చుండగా, సునయుడను గంధర్వుడు వచ్చి 'ఓ రాజపుత్రా

ఈకన్యకామణి నాపుత్రిక. అగస్త్యమహామునిని హేళనము జేసిన కారణమున వైశాలినియై పుట్టినది' అని జెప్పి దేవతలను, ఋషులను, తుంబురాదులను రప్పించి విధి యుక్తముగా గాంధర్వ వివాహమును జరిగించి ఆశీర్వదించి తమ తావులకు జనిరి.

వైశాలిని, అవీక్షిత్తులు అన్యోన్య ప్రేమ గలవారలై విహరించుచుండగా వైశాలిని గర్భవతి యయ్యెను. అంతట గంధర్వలోకమునకు అవీక్షిత్తు సహితముగా వైశాలినిని తల్లి దండ్రులు తీసుకుని వెళ్లిరి. కొన్ని దినంబులకు వైశాలిని శుభ దినమునందు పుత్రుని గనెను. అటుల పుట్టిన బాలునకు తుంబురుడు జాతకర్మాదులు జేసెను. ఆకాశవాణి మరుత్తని పేరుబెట్టెను. దేవతలు వచ్చి ఆ బాలుని జూచి అనేక విధములుగా ఆశీర్వదించి జనిరి.

యీవిధముగా అవీక్షిత్తు భార్యాపుత్రునితో కొంత కాలము గంధర్వలోకమున నుండి ఒకనాటి మంచిదినంబున అవీక్షిత్తు భార్యను పుత్రుని దోడ్కొని నిజపట్టణమునకు తీసుకుని వచ్చి తల్లిదండ్రులకు మ్రొక్కి భార్యను పుత్రుని జూపించెను.

తల్లిదండ్రులు పౌత్రుని జూచి ఆనందమును పొంది పౌత్రోత్సవాదులను జేసి పుత్రునివలన జరిగిన విషయమును దెలుసుకుని సుఖంబుగా నుండిరి.

మరుత్తుడు కాలక్రమమున పెద్దవాడై సకల విద్యలను పరశురామునివద్ద ధనుర్వేద సహితముగా అభ్యసించి యువ రాజ్యమునకు తగినవాడయి వుండగా కరందముడు సంతోష మును పొంది తన కుమారుడు అవీక్షిత్తు అనుమతి ప్రకారము రాజ్యభారమును అంతయును పౌత్రుడు మరుత్తునకు వప్పగించి కరందముడు తన భార్యా సహితముగా తపోవనంబునకు వెడలెను ”

## మరుత్తు చరిత్ర

మార్కండేయుడు జెప్పుచున్నాడు, “ క్రోష్టికీ ! మరుత్తుడు ధర్మయుక్తముగా రాజ్యమును పాలించుచు అనేక యజ్ఞములను జేసి త్రిలోకములను సంచరించుచు ఒక్కనాడు ముంజువ అను బంగారు పర్వతమును జూచి అచ్చటనుండి బంగారమును దెచ్చి దేవ బ్రాహ్మణాదులకున్ను, ధర్మ కార్య ములకున్ను ఖర్చుజేయుచుండెను.

యీ విధముగా నుండగా ఒకనాడు ఒక మహాముని వచ్చి ‘ రాజేంద్రా, మరుత్త మహారాజా ! నీ పరిపాలనమునందు ప్రపంచకమునందు ఎచ్చటను దరిద్రులు లేరుగాని నాగలోకము నుండి సర్పములు భూలోకమునకు వచ్చి యెనమండ్రు మహా ఋషులను కరచి యమలోకమునకు పంపించినవి. ఈ సర్పములు జంతుజాలమునకు ఉపద్రవము జేయుచు వాటికి ఉపయోగపడు

జలములను విషయుక్తముగా జేయుచున్నవి. ఫలపుష్పాదులను గూడా విషయుక్తముగా జేయుచున్నవి. రాజు చేసిన అధర్మ పరిపాలనము ప్రజలకున్ను, ప్రజలు చేసిన పాపములు రాజున కున్ను జెందును ' అని జెప్పి వెడలిపోయెను.

ఆ మాటలను మరుత్తు విని భార్గవాశ్రమమునకు వెళ్లి సకల సర్ప సంహారకరమగు సంవర్తాస్త్రమును ప్రయోగించెను. అంతట ఆ మహాస్త్రము జగసంహార రూపమున బయలుదేరి అగ్నిజ్వాలలు గ్రక్కుచు నాగలోకమునందుగల సర్పములను భస్మీభూతము జేయుచుండెను.

ఆ నాగ ప్రళయమును నాగకన్నియలు జూచి భయపడి వైశాలిని వద్దకు వెళ్లి ' అమ్మా! మాకు నీవు యిచ్చిన వరము ప్రకారము నాగకులమును రక్షింపవలసిన'దని కోరిరి.

ఆ మాటలను వైశాలిని విని భర్త అయిన అవీక్షిత్తును తీసుకుని కుమారుడయిన మరుత్తుని వద్దకు వచ్చి సర్ప సంహార మును మానవలసినదని చెప్పెను.

అటుల వచ్చిన తల్లిదండ్రులకు నమస్కరించి ' తల్లిదండ్రు లారా! యీ సర్పములు యెనమండ్రు మునులను కరచి జంపినవి. ఫలపుష్ప జలాశయములను విషయుక్తముగా జేయు చున్నవి. అట్టి దుర్మార్గులను సంహరించుట రాజధర్మమని జేయుచుంటిని ' అని జెప్పెను.

ఆ మాటలను నాగకన్యలు విని ‘ మహాత్మా ! నేడు మొదలు అన్యాయముగా ప్రజలకు కీడు జేయకుండునట్లును, ఎనమండ్రు మునులను బ్రతికించుటకును వాగ్దానములను జేయుదుము ’ అని వాగ్దానములను జేసి మునులను బ్రతికించిరి. అంతట మహామునులు అందరును సంతోషించిరి.

మరుత్తు సంవర్తాస్త్రమును ఉపసంహారమును జేసి సర్ప కులమును రక్షించెను. అంతట మహాఋషులు, దేవతలు మహా సంతోషమును బొందిరి. అవీక్షిత్తు, వైశాలిని మొదలగు తల్లి దండ్రులు కుమారుని రాజ్యపాలనా సామర్థ్యమునకు సంతసించి తపోవనంబునకు పోయిరి.

# దమ చరిత్ర

ఈ విధముగా మరుత్తు రాజ్యమును పాలించి జ్యేష్ఠునకు ఆదిమ్మంతునకు రాజ్యమునందు పట్టాభిషేకము జేసి భార్యా సమేతముగా తపోవనమునకు జనెను.

ఆదిమ్మంతుడు చాలాకాలము తండ్రి తాతలవలెనే రాజ్యమును పరిపాలనము జేసి తన భార్యయందు సూర్యతేజ సమానుండును, మన్మథరూప సమానుండును అగు దముడను పుత్రుం బడసి ధనుర్విద్యా కుశలుడై ప్రఖ్యాతిం గాంచుచున్న పుత్రుం జూచి తల్లిదండ్రులు సంతోషమును పొందుచుండిరి.

యిట్లుండగా దశార్ణదేశమందుగు చారుకర్ముడను రాజు తన కుమార్తె చారుమతి యను కన్యకకు స్వయంవరమును ప్రకటించగా దముడు ఆ స్వయంవరమునకు వెళ్లెను. ఆ స్వయంవరమునకు అనేకమంది రాజులు, రాజపుత్రులు వచ్చి జేరియుండిరి. ఆ స్వయంవరమునందు చారుమతి దముని వరించెను.

చారుమతి దముని వరించినదని తక్కినరాజులు గుమి గూడి దమునిమీదకు యుద్ధమునకు దిగిరి. అంతట దముడు కాలాంతక రుద్రుని కైవడి చెలరేగి అందరి రాజులను పరాజితులను జేయగా, రాజును చారుమతియు సంతోషమును పొందిరి.

పిమ్మట చారుమతిని దమునకు యిచ్చి విధ్యుక్తముగా వివాహము జేసెను. దముడు భార్యాయుక్తముగా మామగారి యింటియందు కొన్ని దివసంబులు నివసించి అత్తమామల అనుజ్ఞను పొంది తన భార్యను తీసుకుని నిజరాజధానికి వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించి జరిగిన వృత్తాంతమును విన్నవించిరి. దముడు జెప్పిన విషయంబులను విని సంతోషమును పొంది దమునకు రాజ్యభారమును వప్పగించి నరిష్యంతుడు భార్యా యుక్తముగా తపోవనమునకు జనెను.

యిటుల నుండగా వపుష్మంతుడను రాజు అడవికి పోయి అరిష్మంతుడు తపంబు జేయుచుండుటను జూచి ఈ అరిష్మంతుని

పుత్రుడు దముడు తమ్మునుజయించెనని క్రోధముగా వాక్రై
అరిమర్ధంతుని భార్య యింద్రసేన యేడ్చుచు వలదు వలదని
కేకలువేయుచున్ననూ వినక వపుష్మంతుడు అరిమర్ధంతుని
తల నరికివేసి తన రాజధానికి పోయెను.

యింద్రసేన సమీపమునందున్న రక్షకభటులను
బిలిచి 'ఓరి! మీరు నగరమునకు జని నా భర్తను హత్యజే
డయిన వపుష్మంతుడు జంపి యింటికి పోయెనని జెప్పుడు. నేను
దిక్కులేనిదానినై భర్తతో అనలప్రవేశము (సహగమనము)
జేసితినని నా పుత్రుడు దమునితో జెప్పుడు' అని తాను
సహగమనము జేసెను.

అంతట సేవకులు నగరికి వెళ్లి రాజైన దమునకు సర్వ
వృత్తాంతమును విశదపర్చిరి. ఆ వృత్తాంతమును దముడు విని
సభాసదుల యెదుట క్రోధాకారుడై 'నా తండ్రిని, తల్లిని
వంతుని, అనాధవలెనున్న నా తల్లియెదుట నా తండ్రిని జంపిన
నీచుడు వపుష్మంతుని పుత్రమిత్ర అమాత్యాదుల సహితముగా
జంపి ఆ రక్తముచేత నేను పితృతర్పణములను జేతును' అని
ప్రతినబట్టి చతురంగ బలములను తీసుకుని వపుష్మంతుని
పట్టణమును నలువైపుల ముట్టడించి వపుష్మంతునకు యీ
విధముగా చారులవలన వర్తమానమును జేసెను.

'ఓ నీచా! వపుష్మంతా! నీవు పౌరుషహీనుడవు.
పురుషరూపమున నున్న అంగనవు, దుర్మార్గుడవు, జ్ఞాన

సూనుఁడవు పశుతుల్యుఁడవు. అట్టి నీవు నా తండ్రి అరిష్టంతుని నా తల్లిని యేమ్పుచున్నను కరుణలేక తపశ్శాలిని జంపిన పాపాత్ముఁడవు. అట్టి నిన్ను జంపి నీ రక్తమాంసాదులవలన నా పితరులకు పిండప్రధానమును జేసి పితృమాతృ ఋణములను దీర్చెదను' అని వర్తమానమును జేసి 'యుద్ధమునకు రావలసిన'దని చారులవలన వర్తమానము పంపెను.

ఆ వాక్యములను వపుష్మంతుఁడు విని క్రోధాక్రాన్త కాలాహివలె మండిపడి చతురంగ బలములను గూర్చుకుని యుద్ధమునకు వచ్చెను.

అటుల యుద్ధసన్నద్ధుడై వచ్చిన వపుష్మంతునిన్ని, సేనలను దముఁడు జూచి యేనుగు కుంభస్థలములను జీల్చు సింహమువలె వపుష్మంతుని మీదను, సేనలమీదను, తన సేనలను పురికొల్పి కొని తాను వపుష్మంతునిమీదకు దూకి శిరంబును బట్టుకొని వక్షమునందు కాలు ఆని శిరంబును ఖండించి ఆ రక్తమాంసాదులచే పితృమాతృ తర్పణాదులను జేసి ప్రతిజ్ఞను నెరవేర్చు కొనెను.

దముఁడు తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొని నిజ రాజధానికి జేరి సుఖంబుగా నుండెను.

యీ విధముగా సూర్యవంశపురాజులు అనేక ధర్మ మార్గముల ప్రజా పరిపాలనంబు జేసి ప్రఖ్యాతిని పొందిరి" అని మార్కండేయులు క్రోష్టికికి జెప్పగా క్రోష్టికి విని సంతోషమును పొందెను. అంతట మధ్యాహ్న కాలము కాగా క్రోష్టికింబంపించి

మార్కండేయుఁడుచితానుకాలోచితములను దీర్చుకొనుటకు జనెను" అని ధర్మపక్షులు జైమిని మహామునికి జెప్పగా జైమిని ముని మహా సంతోషమును పొందెను.

ధర్మపక్షులు జైమిని మహామునిని జూచి "ముని కులోత్తమా! నీవు అడిగిన నాలుగు ప్రశ్నములకు ఉత్తరంబులును, పితాపుత్ర సంవాదంబును, బ్రహ్మ సృష్టియు, మన్వంతరములును, రాజవంశాను చరితంబును జెప్పబడిన యితిహాస గ్రంథంబగు యీ మార్కండేయ పురాణంబున వివరింపబడి యున్నవి. అందువలన నీ సంశయంబులు అన్నియు దీరెను.

యీ పురాణమును క్రమముగ శాస్త్రోక్తప్రకారంబుగ వినినవారలకు, జదివినవారలకు సమస్త పాపంబులు నశించి అపమృత్యువులు, అరిష్టములు, దుష్టగ్రహ దోషంబులు నశించి సకల సుఖంబులతో, సకల శుభంబులలను పొందుదురు. యిందులకు సందేహము లేదు" అని ధర్మపక్షులు జైమిని మహామునికి జెప్పిన చరిత్రను నీకు జెప్పితిని" అని వైశంపాయన మహాముని జనమేజయునకు జెప్పగా విని జనమేజయుఁడు మహా సంతోషమును పొంది వైశంపాయన మహామునిని షోడశోపచారంబులచేతను పూజించి కృతార్థుడాయెను.

"యీ చరిత్రను వినిన వారికి సకల కార్యములు నెఱవేరి సకల శుభంబులు కలుగుటకు సందియము లేదు" అని వైశంపాయన మహాఋషి పల్కెను.

గద్య, ఇతి శ్రీ వేమూరి సూర్యనారాయణ సిద్ధాంతివర్య
గురుకటాక్ష లబ్ధ శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వర వర
ప్రసాద యజుర్వేద తైత్తిరీయ శాఖాధ్వర ఆపస్తంబ
సూత్రి గౌతమగోత్ర పవిత్ర వోలేటి వంశ పయః
పారావార రాకాసుధాకర సంజీవరాయామాత్య
పౌత్ర రామయామాత్య తృతీయ పుత్ర
బుధజన విధేయ వెంకట లక్ష్మీ
నృసింహాశర్మ ప్రణీత ఇతిహాస
గ్రంథమున మార్కండేయ
పురాణమను తెలుగు
వ చ న కా వ్య ము న
తృతీయాశ్వాసము
శ్రీరాజరాజేశ్వరీ సోమలింగేశ్వరార్పణమస్తు.

శ్రీ గురుభ్యోనమః

# శ్రీ రామచంద్ర ఆపదుద్ధారక స్తోత్రము

ఇది శ్రీ మార్కండేయ మహాముని ధర్మరాజునకు జెప్పిన
శ్రీరామచంద్ర మహాత్మ్యము.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥

అస్యశ్రీ ఆపదుద్ధారక శ్రీరామచంద్ర స్తోత్ర మహామంత్రస్య వసిష్టో భగవాన్ ఋషిః శ్రీ ఆపదుద్ధారక శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః

అంగన్యాస హృదయన్యాసః

౧. ఆపదామపహర్తారం అంగుష్టాభ్యాంనమః హృద
౨. దాతారం సర్వసంపదాం ఐశ్వర్యాయ తర్జనీ=శిరసే
౩. లోకాభి రామం శక్త్యై=మధ్యమా=శిఖాయ
౪. శ్రీరామం బలాయ=అనామికా=కవచాయ
౫. భూయో భూయః తేజసే=కనిష్ఠికా=నేత్రత్రయాయ
౬. నమామ్యహం వీరాయ=కరతలకర=అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః ధ్యానం॥

శ్లో ఆర్తానా మార్తిహంతారం భీతానాం భయనాశనం ।
దిషాంతాం కాలదండంతం రామచంద్రనమామ్యహం॥

శ్లో॥ వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితం
అగ్రేవా చయతి ప్రభంజన సుతేతత్వం మునిభ్యః పదం
వ్యాఖ్యాతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలం॥

శ్లో॥ చాపంధు నాసః స్తనయిత్నుఘోషం ।
కర్షన్నిషం గాదిషు మూర్తినిఘ్నం ।
ఆపత్సు భూయాద భయప్రమేదో
మేసాకం సుమిత్రా తనయేన రామః॥

మూలమంత్రం ౧౦౮

శ్లో॥ ఆపదామ, పహర్తారం ।
దాతారం సర్వసంపదాం ।
లోకాభిరామం శ్రీరామం ।
భూయోభూయో నమామ్యాం॥ ౧

శ్లో॥ ఆపన్న జనరక్షైక దీక్షాయామి
తతే జసే నమోస్తు విష్ణవే
తుభ్యం రామాయాపన్నివారకే,
ఆపదామ, పహర్తారం॥ ౨

శ్లో॥ పధాంభోజ రజస్పర్శ పవిత్ర మునియోషితే,
నమోస్తు సీతాపతయే రామాయాపన్నివారణే
ఆపదామ పహర్తారం॥ ౩

శ్లో॥ దానవేంద్ర మహామత్త గజపంచాస్యరూపిణే!
నమోస్తు రఘునాధాయ రామాయాపన్నివారణే
ఆపదామ పహర్తారం॥ ౪

శ్లో॥ మహిజా కుచ సంలగ్న కుంకుమారుణ వక్షసే నమః।
కళ్యాణరూపాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౫

శ్లో॥ పద్మసంభవ భూతేశ మునిసంస్తుత కీర్తయే నమో
మార్తాండ వంశాయ రామాయాపన్నివారణే ఆప॥ ౬

శ్లో॥ హరత్యార్తించ లోకానాం యోవై మధునిఘాతనం!
నమోస్తు హరయే తుభ్యం రామాయ ఆపన్నివారణే
ఆపదా॥ ౭

శ్లో॥ తాపకారణ సంసార జగసింహ స్వరూపిణే నమో
వేదాంత వేద్యాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౮

శ్లో॥ రంగ తరంగ జలధి గర్వ హృచ్ఛరధారిణే నమః
ప్రతాపరూపాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౯

శ్లో॥ దారో వహిత చంద్రావతంస ధ్యానమూర్తయే
నమస్సత్య స్వరూపాయ రామాయాపన్నివారణే ఆపదా॥

శ్లో॥ తారానాయక సంకాశ వరదాయ మజాజక్షే సే నమోస్తు
తాటకహంత్రే రామాయాపన్నివారణే ఆపదా॥ ౧౦

శ్లో॥ రమ్య శ్యామల సచ్చిత్రకూటాశ్రమ విహారిణే।
నమస్సౌమిత్రి సేవ్యాయ రామాయాపన్నివారణే ఆ॥ ౧౧

శ్లో॥ సర్వదేవహితాసక్త దశానన వినాశినే నమోస్తు దుఃఖ
ధ్వంసాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౧౨

శ్లో॥ రత్నసాను నివాసైక వంద్య పాదాంబుజాయచ।
నమస్త్రైలోక్యనాథాయ రామాయాపన్నివారణే ఆప॥ ౧౩

శ్లో॥ సంసారబంధ మోక్షైక హేతునా నమః కలుష
సంహర్త్రే రామాయాపన్నివారణే ఆపదా॥ ౧౪

శ్లో॥ పవనాసుగ సంక్షిప్త మారీచాద్య సురాలయే। నమో
మఖపరిత్రాతే రామాయాపన్నివారణే ఆపదా॥ ౧౫

శ్లో॥ దాంభికేతర భక్తౌఘ మహదానంద దాయినే నమః
కమల నేత్రాయ రామా ఆపన్నివారణే ఆపదా॥ ౧౬

శ్లో॥ లోకత్రయో ద్వేగకర కుంభకర్ణ శిరశ్ఛిదే నమో
నిరద దేహాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౧౭

శ్లో॥ కాకాసురైక నయనహాగల్లీలాస్త్రధారిణే నమాభక్తైక
వంధ్యాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౧౮

శ్లో॥ భిక్షురూప సమాక్రాంత బలి సర్వైక సంపదే। నమో
వామనరూపాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౧౯

శ్లో॥ రాజీవ నేత్ర సస్పంద రుచిరాంగ రుచోజ్జ్వలైః।
నమః కైవల్యనిధయే రామాయాపన్నివారణే ఆపదా॥ ౨౦

శ్లో॥ మందమారుత సంవీత మందార ద్రుమవాసినే నమః
పల్లవ హస్తాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౨౧

శ్లో॥ శ్రీకంఠ చాప దళన ధురీణా బలబాహవే। నమస్సీతాను
షక్తాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౨౨

శ్లో॥ రాజ రాజ సుహృద్యోషార్చిత మంగళమూర్తయే।
నమ ఇక్ష్వాకువంశాయ రామాయాపన్నివారణే ఆ॥ ౨౩

శ్లో॥ మంజులాదర్శన ప్రేక్షణోత్సుకక విలాసినే నమః
పోషిత భక్తాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౨౪

శ్లో॥ భూరి భూధర కోదండమూర్తధ్యేయ స్వరూపిణే నమోస్తు
తేజోనిధయే రామాయాపన్నివారణే ఆపదా॥ ౨౫

శ్లో॥ యోగీంద్ర హృత్సరోజాత మధుపాన మహాత్మనే।
నమో రాజాధి రాజాయ రామాయాపన్నివారణే ఆ॥ ౨౬

శ్లో॥ భూవరాహస్వరూపాయ నమోభూరి ప్రదాయినే।
నమో హిరణ్యగర్భాయ రామాయాపన్నివారణే ఆ॥ ౨౭

శ్లో॥ యోషాంజలి వినిర్ముక్త లాజాంచి తవపుష్మతే నమ
స్సౌందర్య నిధయే రామాయాపన్నివారణే ఆపదా॥ ౨౮

శ్లో॥ నఖకోటి వినిర్భిన్న దైత్యాధిపతి వక్షసే నమో
నృసింహరూపాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౨౯

శ్లో॥ మాయామానుష దేహాయ వేదోద్ధార హేతవే।నమోస్తు
మత్స్యరూపాయ రామా ఆపన్నివారణే ఆపదా॥ ౩౦

శ్లో॥ మితి శూన్య మహాదివ్య మహిమ్నమా నితాత్మనే।
నమో బ్రహ్మస్వరూపాయ రామాయాపన్నివారణే ఆ॥ ౩౧

శ్లో॥ అహంకారీత రజనిస్వాంత సౌధహారిణే। నమోస్తు
చిత్స్వరూపాయ రామాయాపన్నివారణే ఆపదా॥ ౩౨

శ్రీ సీతా లక్ష్మణ సంశోభి పార్శ్వాయ పరమాత్మనే
శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమస్సమేత
శ్రీరామచంద్రార్పణమస్తు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

# త్రింశన్నత శ్రీరామచంద్ర స్తోత్రము

శ్లో॥ నమ శ్రీ రామచంద్రాయ సుందరాకార
శోభినే పట్టాభి రామభద్రాయ
రామాయ ఆపన్నివారిణే-ఆపదా॥ ౧

శ్లో। నమః కోమల దేహాయ । దివ్యకాంచనభూషిణే
రత్నకుండల హారాయ రామాయ-ఆప। ౨

శ్లో॥ నమః పన్నగతల్పాయ యోగనిద్రా విభూషణే
రత్నకుండల హారాయ రామాయ-ఆప॥ ౩

శ్లో॥ నమః పంకజ మిత్రాయ పన్నగాధిప తల్పినే ।
పక్షీంద్రవాహనాఖ్యాయ రామాయ-ఆప ౪

శ్లో॥ నమ శ్శ్యామల వర్ణాయ దివ్యమంగళ వర్ణనే
చారురత్నకిరీటాయ రామాయ-ఆప॥ ౫

శ్లో॥ నమః పంకజనేత్రాయ కాంచనాంబర శోభినే
కేయూర హారభూషాయ రామాయ-ఆప॥ ౬

శ్లో॥ నమః పాపవినాశాయ తారక బ్రహ్మ మూర్తయే
అచింత్యాయా ప్రమేయాయ । రామాయ-ఆప॥ ౭

శ్లో॥ నమః పట్టాభిరామాయ జానక్యా లక్ష్మణేనచ
భక్తేవచ సేవ్యాయ రామాయ-ఆప॥ ౮

శ్లో॥ నమః కారణ కర్త్రే తే కౌసల్యా ప్రియసూనవే ।
కార్యాకారణ రూపాయా రామాయ-ఆప॥ ౯

శ్లో॥ నమః పూర్ణశరీరాయ పురాణ పురుషాయతే
జగదాధార భూతాయ రామాయ–ఆప॥ ౧౦

శ్లో॥ నమస్సర్వస్వరూపాయ సర్వసాక్షి చరాయచ।
శ్యామలాంచిత రూపాయ రామా–ఆ॥ ౧౧

శ్లో॥ నమస్సుందర దేహాయ రవికోటి విభాసినే।
మన్మథాద్భుత రూపాయ రామాయ–ఆప॥ ౧౨

శ్లో॥ నమశ్శారీ ఙ్గగదా పద్మశంఖ చక్రధరాయచ।
చతుర్భుజ ప్రకాశాయ రామాయ–ఆప॥ ౧౩

శ్లో॥ నమః పల్లవపాదాయ పాణిపద్మ ప్రకాశినే।
సంఫుల్లాంబుజ నేత్రాయ రామాయ–ఆప॥ ౧౪

శ్లో॥ నమః కారణ దేహాయ శ్యామలాంచన దేహినే
మందస్మిత ముఖాబ్జాయ రామాయ–ఆపదా॥ ౧౫

శ్లో॥ నమస్సోమార్క నేత్రాయ భానువంశ ప్రదీపినే
సేవితామర బృందాయ రామాయ–ఆప॥ ౧౬

శ్లో॥ నమః శ్రీ లక్ష్మీనాథాయ సీతారామ మహాత్మనే।
మీనకచ్ఛప రూపాయ రామాయ–ఆప॥ ౧౭

శ్లో॥ నమస్త్రివిధరూపాయ ఉత్పత్తిస్థితి హేతవే।
లయకారణ కర్త్రేతే రామాయ–ఆపదా॥ ౧౮

శ్లో॥ నమః పరమధర్మాయ సమస్త ఋషి సేవితే।
స్వభావ శాంతి రూపాయ రామాయ–ఆప॥ ౧౯

శ్లో॥ నమశ్శాంతాయ నిత్యాయ నిత్యాయ నిగమార్థ
సుబోధినే వేదాంతార్థరూపాయ రామాయ–అష॥ ౩౦

శ్లో॥ నమస్తాపస హర్షాయ నమనాఖ్యాత శాస్త్రినే।
కర్ణకుండల కాంతాయ రామా–అష॥ ౩౧

శ్లో॥ నమః పరమపుణ్యాయ పూర్ణేందు ద్యుతిశోభినే।
కోటికోట్యర్క ధామ్నే తే రామా–అష॥ ౩౨

శ్లో॥ నమః కాలాదికాలాయ శాంఖ్యయోగోద్భవాయచ।
యోగశాస్త్ర విచారాయ రామా–అష॥ ౩౩

శ్లో॥ నమస్సంకర్షణాఖ్యాయ సాకేత పురవాసినే
భరతాగ్రజ నిత్యాయ రామా–అష॥ ౩౪

శ్లో॥ నమః పాపవినాశాయ రామారాజీవ నేత్రినే।
సుగ్రీవాంగద నాథాయ రామా–అష॥ ౩౫

శ్లో॥ నమః కబంధనాశాయ కుంభకర్ణ విఘాతినే
కాంచనాంబర ధారాయ రామా–అష॥ ౩౬

శ్లో॥ నమః కైవల్యనాథాయ రఘువంశ వివర్ధనే
కౌసల్యా గర్భపూర్ణాయ రామా–అష॥ ౩౭

శ్లో॥ నమస్సూక్ష్మ శరీరాయ కుండలాంచిత కండినే।
స్థూల రూప ప్రపంచాయ రామా–అష॥ ౩౮

శ్లో॥ నమః పరంపరాత్మత్వే శంఖ చక్ర గదాధృతే।
శాంతజ్ఞ పాణేచ్యుతే శాయ రామా–అష॥ ౩౯

శ్లో॥ నమః కంజదళాక్షాయ కమలాకాంచ్యదాయినే
కాకుత్స్థాన్వయ భూపాయ రామాయాస్తు నమో నమః॥ 30

శ్లో॥ నమశ్చంపక కల్హార మల్లికామాల్య ధారిణే।
రక్తచందన లిప్తాయ రామాయాస్తు నమో నమః॥ 31

శ్లో॥ నమ స్సూర్యేందుసహస్రభుక్సహస్ర సమతేజసే।
అప్రతర్క్య ప్రభావాయ రామాయాస్తు నమో నమః॥ 32

శ్లో॥ నమశ్చైత్రే సితే శుద్ధ నవమ్యాం ప్రాప్త జన్మనే।
మనుష్య లోకభాగ్యాయ రామాయాస్తు నమో నమః॥ 33

శ్లో॥ నమః ప్రతాప సంచార వశీకృత మహీభుజే।
ధనదీకృత మిత్రాయ రామాయాస్తు నమో నమః॥ 34

శ్లో॥ నమో గుణామృత ద్రోణ పరిపాలిత చింతవే।
అజస్రలభ్య దేవాయ రామాయాస్తు నమో నమః॥ 35

శ్లో॥ నమో లోకత్రయాశ్రిమినేని సంస్తుతాంఘ్రి పదద్వయే।
మహాధైర్యాయ నిధయే రామాయాస్తు నమో నమః॥ 36

శ్లో॥ నమస్సనత్కుమారాది యోగీంద్ర సమాకృత్యనే।
గంభీర జ్ఞాన కృపయే రామాయాస్తు నమో నమః॥ 37

శ్లో॥ నమస్సోమార్కవంశానాం రాజ్ఞాం రాజ్య ప్రదాయినే
బ్రహ్మవంశాభి పూజ్యాయ రామాయాస్తు నమో నమః॥ 38

శ్లో॥ నమస్స్వధర్మ నిష్ఠానాం వర్ణానాం శర్మదాయినే।
అప్రమేయ స్వరూపాయ రామాయాస్తు నమో నమః॥ 39

శ్లో॥ నమస్సంతుష్ట చిత్తాయ కారుణ్యరసరూపిణే।
రఘువంశాబ్ధి చంద్రాయ రామాయాపన్నివారిణే-
ఆపదా॥ ౪౦

శ్లో॥ నమో రాజవరేణ్యాయ సృష్టిస్థిత్యంత కారిణే।
ముని రక్షణ దక్షాయ రామా-ఆప॥ ౪౧

శ్లో॥ నమస్సమస్త లోకానాం అభయధ్వర యజ్వనే
అనంతగుణ పూర్ణాయ రామా-ఆప॥ ౪౨

శ్లో॥ నమస్సీతా ముఖాంభోజ భ్రమరాయిత చక్షుసే।
ఆనంద ఘనరూపాయ రామా-ఆప॥ ౪౩

శ్లో॥ నమః సీతాంబరచ్ఛన్న పృథూరుద్వయశాలినే।
మందస్మిత మనోజ్ఞాయ రామా-ఆప॥ ౪౪

శ్లో॥ నమస్సామిత్ర యుక్తాయ భరతానందకారిణే।
శత్రుఘ్న ప్రియకామాయ రామా-ఆప॥ ౪౫

శ్లో॥ నమః కోదండ తూణీర చర్మావివర ధారిణే।
పురుషార్థ ప్రదీపాయ రామా-ఆప॥ ౪౬

శ్లో॥ నమశ్చంద్రార్క నేత్రాయ చాతుర్యరస సింధవే।
ఆపన్నజన రక్షాయ రామా-ఆప॥ ౪౭

శ్లో॥ నమస్స్మరణ మాత్రేణ సర్వపాప ప్రణాశినే
కిరీట వరజటాజూటాయ రామాయాపన్నివారిణే-
ఆపదా॥ ౪౮

శ్లో॥ నమః కేయూర హస్తాయ మణీహారాఢ్య వక్షసే
శాంతాదిగుణ రామాయ రామా-ఆప॥ ౪౯

శ్లో॥ నమో వనవిహారాయ జటాకుండల ధారిణే।
వల్కలోద్ధార వేషాయ రామా-ఆప॥ ౫౦

శ్లో॥ నమః పవన సంభూత శుశ్రూషాది ముదితాత్మనే।
సర్వలోకాధి నాథాయ రామా-ఆప॥ ౫౧

శ్లో॥ నమస్సంపుల్ల పత్రాబ్జ జైత్ర కోమల మూర్తయే
సంసార క్లేశ నాశాయ రామా-ఆప॥ ౫౨

శ్లో॥ నమః పాషండ విధ్వంస నిరుత్తర విహారిణే।
మోక్షమార్గ ప్రకాశాయ రామా-ఆప॥ ౫౩

శ్లో॥ నమో బ్రహ్మస్వరూపాయ నమస్తే విష్ణురూపిణే।
నమస్తే రుద్రరూపాయ రామా-ఆప॥ ౫౪

శ్లో॥ నమో దిక్పాలరూపాయ సూర్యాదిగ్రహరూపిణే।
అక్షోభ్యశక్తి యుక్తాయ రామా-ఆప॥ ౫౫

శ్లో॥ నమః కాంతారవాసాయ రాక్షసానాం ।
నాశ హేతవే త్రైలోక్యోత్సవ రూపాయ
రామాయాపన్నివారణే-అపహా॥ ౫౭

శ్లో॥ నమః కుండల భూషాయ పుష్పాలంకార శోభినే ।
అనర్ఘ గుణరత్నాయ రామా-అప॥ ౫౮

శ్లో॥ నమో నాగేంద్రతల్పాయ క్షీరాంభోనిధిశాయినే
పృథ్వీ లక్ష్మీ కళత్రాయ రామా-అప॥ ౫౯

శ్లో॥ నమో వేదాంత వేద్యాయ వీరాసన విహారిణే ।
భక్త రక్షాధురీణాయ రామా-అప॥ ౫౯

శ్లో॥ నమస్తే గుణ్యానిధయే విమల జ్ఞానవర్తినే ।
వసిష్ఠ ప్రియ శిష్యాయ రామా-అప॥ ౬౦

శ్లో॥ నమః కౌశిక సంప్రాప్త దివ్యాస్త్రాగమ సిద్ధయే ।
అహల్యా శాప మోక్షాయ రామా-అప॥ ౬౧

శ్లో॥ నమో రామాభిరామాయ నమో దీప్తముఖశ్రియే
శాంతి దాంతి స్వరూపాయ రామా-అప॥ ౬౨

శ్లో॥ నమః కపివర ధ్వంస విచక్షణ గుణాఢ్యయే ।
అఖండబోధ రూపాయ రామా-అప॥ ౬౩

శ్లో॥ నమః ప్రణవ రూపాయ నాదబిందు కళాత్మనే।
కైవల్య సారభూపాయ రామాయాపన్నివారణే-
ఆపదా॥ ౬౪

శ్లో॥ నమః పద్మాకరాంభోజ సుఖం సంతోషితాంఘ్రియే।
బ్రహ్మాండకోటి నాథాయ రామా-ఆప॥ ౬౫

శ్లో॥ నమస్తే సంచితార్థానాం ధాత్రే ధర్మరతాయచ
సర్వ శాస్త్రార్థ సిద్ధాయ రామా-ఆప॥ ౬౬

శ్లో॥ నమస్సత్వత స్వరూపాయ సమగ్రగుణ సింధవే।
దుర్జన ధ్వంస యుక్తాయ రామా-ఆప॥ ౬౭

శ్లో॥ నమో విరోధి సంహారి గంభీర ఘనమూర్తయే
విశాల పద్మ నేత్రాయ రామా-ఆప॥ ౬౮

శ్లో॥ నమః కటాక్ష మాత్రేణ రక్షితా శేషబంధవే।
సర్వ విద్యా స్వరూపాయ రామా-ఆప॥ ౬౯

శ్లో॥ నమః కోమల పాదాబ్జ రజోధ్వస్తజనాంహసే।
దివ్యావతార యుక్తాయ రామా-ఆప॥ ౭౦

శ్లో॥ నమస్సింహాసనోత్సంగ శుభాలంకార మూర్తయే।
కపిసేనాపరీతాయ రామా-ఆపదా॥ ౭౧

శ్లో॥ నమస్సాకేతనాథాయ సీతాహృదయ హారిణే :
రావణ ప్రాణ సంహర్త్రే రామాయాపన్నివారణే-
ఆపదా॥ ౭౨

శ్లో॥ నమో విభీషణ ప్రాణ రక్షార్థిన దయాబ్ధయే ।
సుగ్రీవ ప్రియకామాయ రామా-ఆప॥ ౭౩

శ్లో॥ నమః పురుషసింహాయ దుర్దాదర్ప భుజౌజసే ।
దయా పూర్ణాంతరంగాయ రామా-ఆప॥ ౭౪

శ్లో॥ నమః ప్రకృతి రక్తాయ చంద్రశీతల దృష్టయే '
సీతా లింగితగాత్రాయ రామా-ఆప॥ ౭౫

శ్లో॥ నమః కల్పద్రుమోపాంత రత్నవేదీ ప్రకాశినే :
వ్యాఖ్యాయముద్రాచ లాంగాయ రామా-ఆప॥ ౭౬

శ్లో॥ నమః కాశీ కురుక్షేత్ర సర్వపుణ్య విధాయినే ।
సురా సురైక సేవ్యాయ రామా-ఆప॥ ౭౭

శ్లో॥ నమష్టంకాం కోదండం నిర్ఘాత శరవర్షిణే ।
అమోఘ ఘనశౌర్యాయ రామా-ఆప॥ ౭౮

శ్లో॥ నమశ్శాంతాయ శబ్దాది విధయజ్ఞాన సాక్షిణే ।
సర్వకారణ రూపాయ రామా-ఆప॥ ౭౯

శ్లో॥ నమసంకల్ప సారాయ సర్వాంతర్యామి మూర్తయే
స్వసం విన్మాత్రరూపాయ రామాయాపన్నివారణే-
ఆపదా॥ ౮౦

శ్లో॥ నమస్తాడిత దుష్టాయ పాలితా శేషసాధతే।
మనువంశ ప్రదీపాయ రామా-ఆప॥ ౮౧

శ్లో॥ నమస్తేజోనివాసాయ లీలామానుష రూపిణే।
కోటి సూర్య ప్రకాశాయ రామా-ఆప॥ ౮౨

శ్లో॥ నమో గరుడవాహాయ నమో వైకుంఠవాసనే।
నమస్సత్యస్వరూపాయ రామా-ఆప॥ ౮౩

శ్లో॥ నమః కేవల బోధాయ ప్రమాణ పరచారిణే।
సర్వతంత్ర స్వతంత్రాయ రామా-ఆప॥ ౮౪

శ్లో॥ నమః కుబేర మిత్రాయ పౌలస్త్య వధకారిణే।
అయోధ్యాపుర నాధాయ రామా-ఆప॥ ౮౫

శ్లో॥ నమః పాపవిదూరాయ యశసా భూషితాత్మనే।
లోకపాలోప సేవ్యాయ రామా-ఆప॥ ౮౬

శ్లో॥ నమస్సామాద్యుపాయానాం అవదారణసేవినే।
దీనావన ధురీణా యసురఘ్నాయ రామా-ఆప॥ ౮౭

శ్లో॥ నమస్సత్వ శ్రీవంశాయ కౌసల్యానందదాయినే ।
బ్రహ్మాద్యమరపూజ్యాయ రామాయాపన్నివారిణే
ఆపదా॥ ౮౮

శ్లో॥ నమః కఠోర శస్త్రాస్త్రప్రహరోద్దీప్త తేజసే ।
యుద్ధరక్షణ కల్యాయ రామా-ఆప॥ ౮౯

శ్లో॥ నమశ్శాస్త్రైక గమ్యాయ జయంతేక్షణహారిణే ।
మహాతపః ప్రభావాయ రామా-ఆప॥ ౯౦

శ్లో॥ నమః స్త్రీకూట నాథాయ దండకారణ్య వాసినే ।
ఖరదూషణ సంహర్త్రే రామా-ఆప॥ ౯౧

శ్లో॥ నమశ్చారు చరిత్రాయ జగదానంద కారిణే ।
బ్రహ్మేంద్రార్చిత పాదాయ రామా-ఆప॥ ౯౨

శ్లో॥ నమో మారీచ మృగయా రసలోలుప చేతసే ।
కబంధ దైత్యసంహర్త్రే రామా-ఆప॥ ౯౩

శ్లో॥ నమః ప్రకట శౌర్యాయ విశాల సుభ వక్షసే ।
కళ్యాణ గుణపూరాయ రామా-ఆప॥ ౯౪

శ్లో॥ నమః కపర్దికోదండ ఖండన ప్రథితౌజసే ।
భార్గవస్తుత వీర్యాయ రామా-ఆప॥ ౯౫

శ్లో॥ నమో విదేహ తనయా విభ్రమాలోక భూషయే ।
శృంగార రస రూపాయ రామాయాపన్నివారణే-
ఆపదా॥ ౯౬

శ్లో॥ నమకౌస్తుభ మాణిక్య మనోహర వపుర్ధృతే ।
జగదానంద కందాయ రామా-ఆప॥ ౯౭

శ్లో॥ నమస్సర్వ జగద్రక్షా సిద్ధసంకల్ప సిద్ధయే ।
అపరాధీన కార్యాయ రామా-ఆప॥ ౯౮

శ్లో॥ నమో నందిత పూజ్యాయ మధురాలాప శాలినే ।
నిరవద్య చరిత్రాయ రామా-ఆప॥ ౯౯

శ్లో॥ నమో హిరణ్య రూపాయ సూర్యమండలవర్తినే ।
పద్మహస్తాయ హరయే రామా-ఆప॥ ౧౦౦

శ్లో॥ నమో యజ్ఞస్వరూపాయ యజ్ఞశాలాంతకారిణే ।
యజ్ఞకర్మాభి రాధ్యాయ రామా-ఆప॥ ౧౦౧

శ్లో॥ నమః పుష్పకయానాయ భరద్వాజాభివందినే
గుహ సుగ్రీవయుక్తాయ రామా-ఆప॥ ౧౦౨

శ్లో॥ నమస్తే సంచితార్తానాం అనుగ్రహ విధాయినే ।
సముద్ర సేతు బంధాయ రామా-ఆప॥ ౧౦౩

శ్లో॥ నమః పట్టాభిషేకేణ ప్రతిజ్ఞా పారయాయినే ।
మునిలోచన చంద్రాయ రామాయాపన్నివారణే-
ఆపదా॥ ౧౦౪

శ్లో॥ నమస్సర్వజన క్లేశ హారిణే హితకారిణే ।
రఘు వీరాయ పూజ్యాయ రామా-ఆప॥ ౧౦౫

శ్లో॥ నమ ప్రసన్న హృదయ భోగ మోక్షవిధాయినే ।
కుంభ సంభవ గీతాయ రామా-ఆప॥ ౧౦౬

శ్లో॥ నమ స్సర్వాఘనాశాయ సర్వ పుణ్యవిధాయినే ।
సర్వ సిద్ధాయ రామాయ రామా-ఆప॥ ౧౦౭

శ్లో॥ నమః కోదండ హస్తాయ సంధీకృత శరాయ ।
దండితాఖిల దైత్యాయ రామా-ఆప॥ ౧౦౮

శ్లో॥ నమశ్శుద్ధాంత రంగాయ తారక బ్రహ్మమూర్తయే
సంసారబంధ మోక్షాయ రామా-ఆప॥ ౧౦౯

శ్లో॥ నమ సుగ్రీవనాథాయ అయోధ్యాపురవాసినే ।
జానకీ ప్రాణ నాథాయ రామా-ఆప॥ ౧౧౦

శ్లో॥ నమః కాకుత్థ్సవంశాయ కౌసల్యా తనయాయచ ।
హనుమత్సేవ్య పాదాయ రామా-ఆప॥ ౧౧౧

శ్లో॥ నమశ్చంద్రాగ్ని నేత్రాయ హారశోభిత వక్షసే ।
వాలినాశాయ దేవాయ రామాయాపన్నివారిణే-
ఆపదా॥ ౧౧౨

శ్లో॥ నమస్సత్యస్వరూపాయ శరాగ్రగతసింధవే ।
నిర్భగ్నహర చాపాయ రామా-ఆప॥ ౧౧౩

శ్లో॥ నమస్సంచర దుగ్రాగ్ర ప్రజ్వలచ్చిత్రభానవే ।
శాంత రూపాయ భక్తేషు రామా-ఆప॥ ౧౧౪

శ్లో॥ నమః కాంతారవాసాయ పవిత్ర పదరేణవే ।
నామశోషిత పాపాయ రామా-ఆప॥ ౧౧౫

శ్లో॥ నమః కారుణ్య నిధయే జటావల్కలధారిణే ।
పితృవాక్యాను పాలాయ రామా-ఆప॥ ౧౧౬

శ్లో॥ నమః కోమలదేహాయ యహల్యా శాపవిమోచనే ।
శివలింగ ప్రతిష్టాత్రే రామా-ఆప॥ ౧౧౭

శ్లో॥ నమః ఖరశిరోహంత్రే కుంభకర్ణ విదారిణే ।
దశకంఠ శిరచ్ఛేత్రే రామా-ఆప॥ ౧౧౮

శ్లో॥ నమశ్సీతా సమాయుక్తా కాలే శృంగారధారిణే ।
భక్త దారిద్ర్య నాశాయ రామా-ఆప॥ ౧౧౯

శ్లో॥ నమో నమస్తే గీర్వాణత్రాణ మానుష రూపిణే।
జిత భార్గవ రామాయ రామా యాపన్నివారణే-
ఆపదా॥ ౧౩౦

శ్లో॥ నమః కళ్యాణ వేషాయ భక్తాభీష్ట ప్రదాయినే।
నిత్యానందాయ రామాయ రామా-ఆప॥ ౧౩౧

శ్లో॥ నమశ్చండీశ కోదండ ఖండనాయ మహాత్మనే।
భానువంశ ప్రదీపాయ రామా-ఆప॥ ౧౩౨

శ్లో॥ నమశ్శ్యామల వర్ణాయ తాటకా ప్రాణహారిణే।
వారి జాతాచ నేత్రాయ రామా-ఆప॥ ౧౩౩

శ్లో॥ నమః కైవల్యనాథాయ దండకారణ్య వాసినే।
లక్ష్మణ ప్రాణనాథాయ రామా-ఆప॥ ౧౩౪

శ్లో॥ నమశ్శైలేంద్ర జాజప్యనామ్నే ముక్త్యేక హేతవే।
విరాధ ప్రాణహంత్రేతే రామా-ఆప॥ ౧౩౫

శ్లో॥ నమః పాదప్రచారేణ వనాంతర చరాయచ।
ధనుర్ధరాయ దేవాయ రామా-ఆప॥ ౧౩౬

శ్లో॥ నమః ఫుల్లాబ్జ నేత్రాయ పల్లవారుణ పాణయే।
విశాల దివ్య దేహాయ రామా-ఆప॥ ౧౩౭

శ్లో॥ నమస్సాకేత దీపా సీతానాధాయ శార్జిణే
విశుద్ధ జ్ఞానదేహాయ రామాయాపన్నివారణే-
ఆపదా॥ ౧౨౮

శ్లో॥ నమః కోదండ హస్తా యక్షర యోగ ధరాయచ
నామ నిర్ధూత పాపా రామా-ఆప॥ ౧౨౯

శ్లో॥ నమోనమో మంగళాయ మంగళంతే దయాబ్ధయే
రామాయ సహసీతాయ రామాయాపన్నివారణే
ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామ భూయోభూయో
నమామ్యహం॥ ౧౩౦

ఆపదుద్ధారక శ్రీరామచంద్ర స్తోత్రం సంపూర్ణం.

శ్లో॥ యరక్షర పదభ్రష్టం। మాత్రాహీనంతు యద్భవేత్।
తత్సర్వం క్షమ్యతాం దేవ రామచంద్ర నమోస్తుతే॥

శ్లో॥ యాదృశం పుస్తకం దృష్ట్వా। తాదృశం లిఖితంమయా।
అబద్ధంవా సుబద్ధంవా మమదోషో న విద్యతే॥

# ఫలిస్తుతి

ఇమం స్తవం భగవతః పఠేద్యః ప్రీతి మానసః ప్రభాతేవా । ప్రదోషేవా ! రామస్య పరమాత్మనః । సతు తీర్త్వాభవాంబోధిం ! ఆపదస్సకలా అపి । రామసాయుజ్య మాప్నోతి దేవదేవ ప్రసాదతః ; కారాగృహాది బాధాసు । సంప్రాప్తే బహు సంకటే । ఆపన్నివారకం స్తోత్రం పఠేద్యస్తు యథావిధి సంయోజ్యానుష్టుభ్ఛందః మంత్రం అనుష్టుప్ శ్లోకం స్మరన్విభుం సప్తాహాత్సర్వబాధాభ్యోముచ్యతే నాత్ర సంశయః॥

ద్వాత్రింశద్వార జపితా ప్రత్యహం సుదృఢవ్రతః । వైశాఖే భానుమాలోక్య ప్రత్యహం శతసంఖ్యయా ! ధనేన ధనదప్రఖ్యః । సంభవేన్నాత్రసంశయః ! బహునాత్రః ముక్తేన యంయంకామ యతేనరః । తంతంకామ మవాప్నోతిస్తోత్రేణా నేన మానసః యంత్రపూజా విధానేన జపహోమాది తర్పణైః యస్సుకుర్వీత సహస్రా సర్వాన్కామానవాప్నుయాత్ । ఇహ లోకే సుఖీభూత్వా పరం ముక్తో భవిష్యతి॥

ఇతి శ్రీరామచంద్ర ఆపదోద్ధారక స్తోత్రం సీతా
లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్రార్పణమస్తు॥

శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరాయనమః.

# ౧౪ మనువులు

| | | | | |
|---|---|---|---|---|
| ౧. | స్వాయంభువ మనువు — | కార్తీక | శు॥ | ౧౨ |
| ౨. | స్వారోచిష — | ఆశ్వయుజ | ,, | ౯ |
| ౩. | ఉత్తమ మన్వంతరం — | చైత్ర | ,, | ౩ |
| ౪. | తామస మనువు — | భాద్రపద | ,, | ౩ |
| ౫. | రైవత మనువు — | పుష్య | ,, | ౧౧ |
| ౬. | చాక్షుష మనువు — | ఆషాఢ | ,, | ౧౦ |
| ౭. | వైవస్వత మనువు — | మాఘ | ,, | ౭ |
| ౮. | సూర్యసావర్ణి — | శ్రావణ | బ॥ | ౮ |
| ౯. | దక్షసావర్ణి — | చైత్ర | శు॥ | ౧౫ |
| ౧౦. | బ్రహ్మసావర్ణి — | ఫాల్గుణ | ,, | ౧౫ |
| ౧౧. | ధర్మసావర్ణి — | జ్యేష్ఠ | ,, | ౧౫ |
| ౧౨. | రుద్రసావర్ణి — | ఆషాఢ | శు॥ | ౧౫ |
| ౧౩. | రౌచ్య మనువు — | ఆషాఢ | బ॥ | ౮ |
| ౧౪. | భౌత్య మనువు — | కార్తీక | శు॥ | ౧౫ |

యీ మనువులు ఆయాతిథులయందు అవతరించిరి.

# యు గ ము లు

| ప్రమాణములు | | | ఆవతరణ | | |
|---|---|---|---|---|---|
| ౧. | కృతయుగము | 1728000 | కార్తీక | శు॥ | ౧ |
| ౨. | త్రేతాయుగము | 1296000 | వైశాఖ | శు॥ | ౩ |
| ౩. | ద్వాపరయుగము | 864000 | మాఘ | బ॥ | ౧౩ |
| ౪. | కలియుగము | 432000 | భాద్రపద | బ॥ | ౧౩ |

# సంఖ్యా మానము

శ్లో॥ ఏకం దశం, శతంచైవ సహస్రమయుతం, దధా ।
లక్షశ్చ నియుతశ్చైవ, కోటిరర్బుద, మేవచ, బృందః ।
ఖర్వోని ఖర్వశ్చ శంఖపద్మాచ సాగరః ।
అంత్యం మధ్యం పరార్ధశ్చ దశా వృద్ధ్యా యధాక్రమః॥

సంపూర్ణము.

శ్రీ రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.